## గంటల పంచాంగం

ఖర సం|| భాద్రపద బ|| తృతీయ
1951 సం|| సెప్టెంబరు 18 మంగళవారం
మం|| తృతీయ ప 3-25 అశ్వ రా 2-16
వర్జ్యం రా 10-10 ల 11-48 కు.
బ|| చవితి సెప్టెంబరు 19 బుధవారం
బు|| చవితి ప 3-48 భర రా 3-35
వర్జ్యం ప 12-21 ల 2-5 కు.




# ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యొనరించిన నరవర,
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం|| భాద్రపద బ|| తృతీయ
మంగళవారం


## నూతన కార్యవర్గం

కాంగ్రెస్ నూతన కార్యవర్గాన్ని గమనిస్తే క్రిందటి అయిదారుమాసాలుగా పండిట్ జవహర్లాల్ నెహ్రూ కోరుతూవుండి కేవలం కార్యవర్గ పునర్నిర్మాణమే కాదని స్పష్టమౌతున్నది. కార్యవర్గ పునర్నిర్మాణం కాంగ్రెస్ లక్ష్యాలను, ఆ లక్ష్యసాధనకు అనుసరించే కార్యక్రమాలను చిహ్నం కావాలని ప్రధానమంత్రి సూచించారు. ఇప్పటి కార్యవర్గాన్నిబట్టి కాంగ్రెస్ లక్ష్యాలను, కార్యక్రమాలను ఎంతవరకు గ్రహించగలంటోప్లానింగు కమిషను ఉపాధ్యక్షుడు శ్రీ గుల్జారిలాల్ నందాను కాంగ్రెస్ కార్యవర్గంలో చేర్చుకోవడం వల్ల పండిట్ నెహ్రూ ఈ కమిషనుకు విశేష ప్రాధాన్యమిస్తున్నట్లు మరొకసారి స్పష్టమైంది.

బొంబాయినుంచి క్రిందటి అయిదారు సంవత్సరాలుగా కాంగ్రెస్ కార్యవర్గసభ్యుడుగా ఉన్న యస్. కె. పాటిల్ గారికి బదులు మొరార్జీ దేశాయిగార్ని, నిజలింగప్పగారి స్థానంలో శ్రీనివాసమల్లయ్యగార్ని కర్నాటకంనుంచి పండిట్ నెహ్రూగారు ఎన్నుకున్నారు. కార్యదర్శులు శ్రీ వెంకట్రావు, మోహన్ లాల్ గౌతమ్ గార్ల స్థానాల్లో నెహ్రూ-టాండన్‌లమధ్య రాజీ కుదర్చడానికి ఎక్కువగా ఆఖరుదశలో కృషిచేసిన లాల్ బహదూర్ శాస్త్రిగారినీ, శ్రీనివాస మల్లయ్యగారిని నియమించుకున్నారు.

హరిజన్ ప్రతినిధిగా ఉంటున్న జగ్జీవన్ రాం గారి స్థానం, 1937 లో శ్రీ రాజగోపాలాచారిగారి రాష్ట్రమంత్రివర్గంలో సభ్యుడుగా ఉన్న శ్రీ వి. ఐ. మునుస్వామి పిళ్లెగారికి లభించింది. శ్రీ రాజగోపాలాచారిగారు రాజకీయాలనుండి విరమించుకోదలచినందువల్ల, వారి కోర్కెను మన్నించి పండిట్ నెహ్రూ వార్ని కార్యవర్గంలో చేసుకోలేదు. పత్రికల వల్ల శాసనం కాగానే వారు హోంశాఖామంత్రి పదవిని నిర్వహించగలరనే వదంతులు నిరాధారములు కావనిగూడా ఇందువల్ల స్పష్టమౌతున్నది.

వెనుకటి కార్యవర్గానికి ప్రస్తుత కార్యవర్గం పూర్తిగా భిన్నంగా ఉందని చెప్పలేము. లినమాదిరి జిల్లో చిందగల, తనతోపాటు ముందుకు ప్రయోగించగలవారే, తన భావాలను గ్రహించి తనతో అంగీకరించగలవారే కాంగ్రెస్‌లో ఉండాలని నూతన అధ్యక్షుడు పదవీ స్వీకారం చేసినవెంటనే స్పష్టంచేశారు. ఆ దృక్పథంతోనే పండిట్ నెహ్రూ తన కార్యవర్గాన్ని ఏర్పాటుచేసుకున్నారు. ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డిగారు కాంగ్రెస్ కార్యవర్గసభ్యులు కావడం ఆంధ్రలోని అన్ని వర్గాల వారికి సంతోష కారణమని చెప్పవచ్చును. వారు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక కాగానే ప్రత్యర్థుల విషయంలో వారు ప్రదర్శించిన ఔదార్యం ఎంతటి ప్రశంసలను పొందింది. వారి ఈ దృక్పథ ప్రభావం కేంద్ర కార్యవర్గంపై కూడా కొంతవరకుండగలదు. కాంగ్రెస్ వాదుల ఐకమత్యాన్ని ఇట్టి దృక్పథంతో నిర్ణయమయ్యే విధానం సాధించగలదనడానికి సందేహం లేదు.

బాబు పురుషోత్తమదాస్ టాండన్ పండిట్ నెహ్రూ ఆహ్వానాన్ని అంగీకరించి వారి కార్యవర్గంలో చేరుటకూడా ప్రత్యేకంగా పేర్కొనతగి వుంది. వారు ప్రదర్శించిన ఈ వైఖరే వారి కార్యవర్గ సభ్యులందరూ ఆదినుండీ ప్రదర్శించినట్లయితే ఇప్పటి అసాధారణ పరిస్థితులే ఏర్పడివుండేవి కావు. కాంగ్రెస్ వాదులందరుకూడా ఇదే విధంగా ప్రవర్తించాలనీ, ప్రవర్తించగలరనీ ఆశిస్తున్నాము.

కాంగ్రెస్‌ను వదలివేరే పార్టీలను ఏర్పాటుచేసుకున్న వారు ప్రస్తుతంలో కాకపోయినా ఎన్నికల అనంతరం అయినా తిరిగి కాంగ్రెస్‌లో చేరగలరని, అందుకు పండిట్ నెహ్రూ అనుసరిస్తున్న విధానం ఎక్కువగా తోడ్పడగలదనివిశ్వసిస్తున్నాం.

## ప్రధాని పదవిపై నెహ్రూ విసుగు

లక్నో, సెప్టెంబరు 16: జనరలు ఎన్నికలు అయిన అనంతరం, అన్ని పదవులనూ, బాధ్యతలనూ వదిలించుకొని తనకు తోచిన స్వతంత్ర మార్గాన తాను దేశానికి సేవచేయగోరుతున్నట్లు పండిట్ నెహ్రూ ఈవేళ యిక్కడ ప్రకటించారు.

ఈవేళ యిక్కడ బహిరంగ సమావేశంలో ఉపన్యసిస్తూ ఆయన ఇలా అన్నారు:- "కాంగ్రెసు అధ్యక్ష పదవినే గాక ప్రధానమంత్రి పదవిని కూడా పరిత్యజించాలని కోరుతున్నాను. ఈ ప్రధాన మంత్రిత్వంతో నాకు విసుగు పుట్టిపోయింది. ఈ పదవి బాధ్యతలూ విధినిషేధాలూ ఏవీ లేకుండా స్వతంత్రంగా కృషిచేయాలని కోరుతున్నాను. అయితే నా అంతిమనిర్ణయం అప్పటి పరిస్థితుల్ని బట్టి వుంటుంది" అని ఆయన వివరించారు.

## ప్రకాశంగారి ఆరోగ్యస్థితి

మద్రాసు, సెప్టెంబరు 17: టంగుటూరి ప్రకాశంపంతులుగారు శస్త్రచికిత్స జరిగిన నాల్గురోజుల బలహీనంగా ఉన్నా నిన్నటికన్నా నేడు కొంతమెరుగ్గా వున్నది. పౌర్ణమి నాటిరాత్రి గడ్డురాత్రిగా వైద్యులు భావించారు. నిన్నను డాక్టరు గురుస్వామి మొదలియారు, లెఫ్టినెంట్ కల్నల్ ప్రసాదరావు, డా|| పాల్, డా|| సుందరవదనం, డా|| శివరామచంద్రమూర్తి గారలు ప్రకాశంగారిని చాలాసేపు పరీక్షచేసి, బలంగలకటానికి రక్తం ఎక్కించారు. మున్నగాత్రికన్న నిన్న కొంతనయం. ఇవాళ కొంచెం మాట్లాడగలుగుతున్నారు. జయప్రకాశ్ నారాయణ్ గారు ఇవాళ ఉదయం పంతులుగారిని దర్శించబోయి పోయారు. వారు వచ్చేసరికి పంతులుగారు నిద్రపోతున్నారు. నిద్రలేచిన తరువాత కబురుతెలుసుకొని మళ్ళీ వచ్చి తమను చూసిపోవలసిందిగా పంతులుగారు వారికి కబురుపంపారు.

ప్రకాశంగారితో ఎవ్వరుగాని వచ్చి రాజకీయాలు మాట్లాడరాదనీ వారికి ఎంతవిశ్రాంతి ఇస్తేఅంత త్వరగా కోలుకుంటారనీ డాక్టర్లు వచ్చిన వారికి చెబుతున్నారు.

సాయంకాలం 4 గంటలకు విచారించగా శ్రీ ప్రకాశంగారు క్రమంగా ఆరోగ్యం పొందుతున్నారని సమాచారం తెలుపబడింది.

ప్రకాశంగారి ఆరోగ్యం చక్కబడాలని దేవాలయాల్లో పూజలు జరపాలని స్వామి సీతారాంగారు ప్రకటించారు. "ప్రకాశం నాయకులందరికీ గొప్ప నాయకుడు. ప్రజాబాహుళ్యానికి ప్రియతముడు. స్వాతంత్ర్య సమరంలో మహా నాయకత్వం వహించి జైలుకేగిన వ్యక్తి" అని స్వామీజీ అన్నారు.

# 'మద్రాసుతో ఆంధ్రరాష్ట్రాన్ని ముడిపెడితే ఇంతలో రాష్ట్రం రాదు'

## విజ్ఞాన సమితి సభలో కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి అభిభాషణ

మదరాసు, సెప్టెంబరు 17: సత్వరాంధ్రరాష్ట్ర సిద్ధికై ప్రాయోపవేశ మహాయజ్ఞం చేస్తున్న స్వామి సీతారాంగారి ప్రయత్నంపట్ల తమ సానుభూతి తెలియజేయడానికి నిన్న సాయంత్రము ఆంధ్ర విజ్ఞాన సమితిలో బహిరంగసభ జరిగింది. సమితి సభ్యులు, విద్యార్థులు తదితరులు దాదాపు 50 మంది స్వామీజీ ఉపవాసానికి సానుభూతిగా నిన్న ఉదయంనుండీ ఉపవాసంచేసి, పగలంతా ప్రార్థనలు, పారాయణలు, భజనలు జరిపారు.

సాయంత్రం సభకు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు అధ్యక్షతవహించారు. వారు ప్రారంభంలో ప్రసంగిస్తూ ఇలా అన్నారు: "ముఖ్య జిల్లాల వారిమైన మేము మొదటనుండీ మదరాసులేని ఆంధ్రరాష్ట్రం యే మాత్రం వలదని పట్టుపట్టివాదించాము. అయితే 1950 జనవరి 26 వ తేదీ నాటికి రాష్ట్రం తప్పక వచ్చివేస్తుందని ఊదరపెట్టి నాయకులు అపుడు జె. వి. పి. నివేదకను అంగీకరించి మదరాసును తిలోదకాలు ఇవ్వడానికి మమ్మల్ని ఒప్పించారు. మా అభిప్రాయం యేమైనప్పటికి అందుకు ఒప్పుకున్నాం. అపుడు తిరిగి ఒక తీరానంలో మదరాసును ప్రత్యేక నగర రాష్ట్రంగా చేయాలని తెలపవలెనంటూలాన రాష్ట్రం లభించక జరిగిన కృషిఅంతా వృథా అయింది. మనము మదరాసుపై వాక్కును వదలుకున్నామని ఒకపై చెప్పి, దానిని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలని చెప్పడంలో అర్థమేమున్నది? మనకు లేకపోయినప్పుడు దాని ఊసు మనకెందుకని ఊరక ఉండాలి గాని, ప్రత్యేక రాష్ట్రంగా వుండాలని మనమెందుకు కోరవలెను? ఆంధ్ర రాష్ట్రం మతో మదరాసును ముడిపెట్టకపోతే సమీపంలో రాష్ట్రం సిద్ధించదు. మదరాసును వదలుకోపెట్టయితే త్వరలో రాష్ట్రం లభించవచ్చు. మనకు రాష్ట్రం ముఖ్యమా, మదరాసు ముఖ్యమా అనేది మనం ముఖ్యంగా నిర్ణయించుకో వలసియున్నది" అన్నారు.

ఈ సమయంలో సభ్యులందరూ మద్రాసు వదలుకోరాదని, అలా మదరాసుకు తిలోదకాలివ్వడానికి కాంగ్రెసు నాయకులకు గాని, మరెవ్వరికి గాని యేమాత్రం హక్కులేదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

రామకృష్ణ రాజుగారు తరువాత మాట్లాడుతూ మదరాసు వదలరాదని ప్రజల అభిప్రాయమే అయితే మదరాసుమీద హక్కును వదులుకో జాలమని ప్రజలు నిష్కర్షగా ప్రకటించి యూలోపుగా ఉపవాసవ్రతం మానమని స్వాములవారిని కోరి, ఆపైన మదరాసుతో కూడిన ఆంధ్రరాష్ట్రం సాధించడానికి ఆందోళన సాగించవలసి వుంటుందని అన్నారు. ప్రజాభిప్రాయం అదేగనక అయితే తాను తన వెనుకటి నిర్ణయాన్ని మార్చుకొని ఆందోళనను బలపరచడానికి తనకెట్టి ఆక్షేపణా లేదని చెప్పారు.

కర్నూలో శాస్త్రిగారు మదరాసు ఎన్నటికీ తమిళులది కాదని, మదరాసుమీద మనకు హక్కును వదలివేయాలనడంలో నిమాత్రంఅర్థం లేదని అన్నారు.

ఆంధ్రులకు తప్పక మదరాసుతో కూడిన ఆంధ్ర రాష్ట్రమే కావాలిగాని తలలేని మొండెము వున్నప్పటికీ ప్రయోజనం ఉండదన్నారు.

శ్రీ ఆర్. శివరామమూర్తి సి. వి. రామకృష్ణరావు శ్రీరామమూర్తి బి. ఎస్. శర్మ గారలు మదరాసుమీదహక్కును వదులుకోటానికి యేమాత్రం వీల్లేదని మాట్లాడారు.

అపైన సభవారు శ్రీ స్వామి సీతారాంగారు ఆంధ్ర రాష్ట్ర సంపాదనకయి ప్రాయోపవేశ దీక్షబూని మహాత్యాగం చేస్తున్నందుకు వారిసేవను మెచ్చుకుంటూ భగవంతుడు వారి ప్రాణాలను రక్షించాలని ప్రార్థిస్తూ తీర్మానించారు.

నిర్వాసన సంఘ నివేదిక ప్రాతిపదికగా ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయటానికి ప్రజాభిప్రాయానికి ప్రతికూలంగా వున్నదని, ఆ నివేదికమీద ప్రజలు అభిప్రాయం తెలియ చేయడానికి దానిని ప్రచురించే అవకాశమివ్వాలని వేరొక తీర్మానంలో కోరారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించిన యే ప్రతిపాదనలోనైనా మదరాసుపై హక్కు వదలుకోవడానికి ఎవరికిగాని అధికారం లేదని నగరం విషయంలో ఆక్షేపణ వుంటే ఆ వివాదాంశాన్ని, అక్షేపించకరు మొదలగు ఇతర వివాదాంశాలనూ వినోబాభావే, లేదా డా|| రాజేంద్రప్రసాద్ గార్ల మధ్యవర్తిత్వానికి నివేదించాలని సభవారు కోరుతూ తీర్మానించారు.

### బొంబాయి ఆంధ్రమహాసభ సూచన

బొంబాయి, సెప్టెంబరు 17: ఆంధ్ర మహాసభ అధ్యక్షతన నిన్న సాయంకాలము జరిగిన బహిరంగసభలో బొంబాయి ఆంధ్రులు అధిక సంఖ్యాకులుగా పాల్గొని ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యపై ప్రభుత్వంవారిచేత, ప్రజలలోను కదలిక కలిగించడానికి స్వామి సీతారాం ప్రభృతులు 38 రోజుల నుండి దీక్షగా నిరశనవ్రతము సాగిస్తున్నందుకు అపరిమితమైన ఆందోళన వెలిబుచ్చారు. స్వామీజీ ఉదారతయమును బొంబాయి ఆంధ్రులు అభినందిస్తూ ఇప్పుడు గుంటూరులో ఉపవసిస్తున్న స్వామీ సీతారాంగారునూ వారి శిష్యబృందమునూ ఉపవాసం మానాలని ప్రార్థించారు. బొంబాయి విశ్వవిద్యాలయాచార్యులు శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు సభకు అగ్రాసనాధిపత్యము వహించారు. మహాసభాధ్యక్షులు సూర్యారాయ్, శ్రీ రాజన్న, శ్రీ కె. సత్యనారాయణరావుగారలు ఉపన్యసించారు.

ఆంధ్రరాష్ట్రాన్ని త్వరలో నిర్మించాలని భారత యూనియను ప్రభుత్వాన్ని కోరే తీర్మానాన్ని సభవారు చేశారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగనిపక్షమున వచ్చే ఎన్నికలలో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి కృషిచేస్తామని ప్రమాణాలు చేసిన వారికే వోట్లివ్వవలెనని మరొక తీర్మానం వోటర్లను కోరుతున్నది.

ఆచార్య వెంకట రంగయ్యగారు ప్రసంగిస్తూ ఇలా అన్నారు: "ఆంధ్ర రాష్ట్ర నిర్మాణసమస్య విషయమై ఆంధ్రులలో భిన్నాభిప్రాయాలున్నవి. ఐనప్పటికీ స్వామీ సీతారాం నిరశనదీక్షను మాన్పించి, దేశానికి అమూల్యమైనవారి ప్రాణాన్ని రక్షించాలంటే ముందట మద్రాసు రాష్ట్రమునందలి ఆంధ్రజిల్లాలతో రాష్ట్రాన్ని నిర్మించే కృషిపై దృష్టి కేంద్రీకరించాలని ఆంధ్రులలో అత్యధిక సంఖ్యాకులు తలుస్తున్నారు. తరువాత హైదరాబాదు, మైసూరు, మధ్య రాష్ట్రములలోని ఆంధ్రప్రాంతాలను కలిపి విశాలాంధ్రమును నిర్మించాలని వత్తిడి చేసే హక్కును మనము వుంచుకోవాలి. ఆంధ్రులు తమలో తమకుగల విభేదాలను తొలగించుకొని వెంటనే ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించడానికి నడుముకట్టాలి."

### ఆంధ్రరాష్ట్ర ఉద్యమంపట్ల హైదరాబాద్ ప్రజల సానుభూతి

వరంగల్లు, సెప్టెంబరు 16: ఈ ప్రాంతవాసులు ఆంధ్రరాష్ట్ర అవతరణాన్ని హర్షిస్తున్నారు. మంత్రి బూర్గుల రామకృష్ణారావు, మాడపాటి హనుమంతరావు, రంగారెడ్డి, రామానందతీర్థ గార్లు చేసిన ప్రకటనలే యిందుకు తార్కాణం.

స్వామి సీతారాంగారి ఉద్యమానికి సానుభూతి సూచకంగా నిరాహారదీక్షపూనివున్న ధేండాటు ప్రసాదరావుగారు భువనగిరి మొదలుగాగల పట్టణాలలో సభలు జరిపి నేడిక్కడకు వచ్చారు. ఈయన రేపు గుంటూరులో జరుగబోయే ఆంధ్ర నాయకుల సమావేశానికి హాజరుకానున్నారు. స్వ. వి.

### విశాఖ పురపాలక సంఘ తీర్మానం

విశాఖపట్నం, సెప్టెంబరు 15: ఈ పురపాలక సంఘం నిన్న సాయంకాలం ప్రత్యేక సమావేశం జరిపి, అక్టోబరు 2 వ తేదీ కల్లా ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు చేయాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. మద్రాసు నగరము, ఇతర వివాద ప్రాంతాలు, డబ్బు పంపిణీ మొదలగు వాటిపై మధ్యవర్తి సంఘమును సరిహద్దునిర్ణయ సంఘమును యేర్పాటు చేసి, వాటితీర్పులను తరువాత అమలు జరుపవచ్చునని గూడా యీ తీర్మానంలో సూచించారు. ఈ తీర్మానం భారత రిపబ్లిక్ అధ్యక్షుడైన రాజేంద్రప్రసాద్‌కు ప్రధానమంత్రి నెహ్రూకు పంపబడింది. జగన్నాథస్వామి ఆలయంలో జట్టుకు 25 మంది చొప్పున, జట్లు, జట్లుగా 24 గంటల ఉపవాసం యింకా సాగిస్తూనే ఉన్నారు.

### కేంద్రప్రభుత్వానికి రాయలసీమ ప్రజల అభ్యర్థన

కర్నూలు, సెప్టెంబరు 15: ఈపట్టణ కాంగ్రెసు అధ్యక్షులగు ఆదివారం జిల్లా కాంగ్రెసు ప్రజాపార్టీ అధ్యక్షులు నాయకంటి శంకర రెడ్డిగారి అధ్యక్షతనుజరిగినప్రజలసభలో స్వామి సీతారాంగారు ఆంధ్రరాష్ట్ర సిద్ధికై ప్రాయోపవేశం చేస్తున్నందుకు తమ ఆందోళనను వెలిబుచ్చుతూ స్వామీజీ ప్రాణమునకు అపాయము యేర్పడకముందే వివాదగ్రస్తమైన విషయాలను మధ్యవర్తుల పరిష్కారానికి వదిలి ప్రస్తుతం ఆంధ్రప్రజా కాంగ్రెసు అధీనమందున్న ప్రాంతంతో వెంటనే ఆంధ్రరాష్ట్రమును యేర్పాటు చేయ తగుచర్య తీసుకొనవలెనని భారత ప్రధాని జవహర్లాల్ నెహ్రూను కోరుతూ తీర్మానముచేశారు.

### నెహ్రూకు కె. లింగరాజుగారి లేఖ

రాజమహేంద్రవరం, సెప్టెంబరు 15: మద్రాసు ఎం. ఎల్. ఏలు కొందరు స్వామి సీతారాంగారి ప్రాయోపవేశ సందర్భంలో యిటీవల భారత ప్రధానికి పంపిన విజ్ఞప్తికి నెహ్రూ యిచ్చిన సమాధానం "నూరు యేండ్లదాకా ఆగాలనుకుంటా వ్యంగ్యంగా, ఆంధ్ర ప్రజలను న్యూనపరచేదిగా వున్నదని" శ్రీ కొవ్వూరి లింగరాజు ఎం. ఎల్. ఎ. గారు నేడు నెహ్రూకు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. నెహ్రూ ఇచ్చిన సమాధానం పరిపాలకుడు తన పాలితులకు యిచ్చే సమాధానంగా వున్నదకానీ, నెహ్రూవంటి నాయకుడు ఈయదగ్గ సమాధానంగా లేదనికూడా ఆయన అన్నారు. 'ఆంధ్ర రాష్ట్ర వ్యతిరేకులు కూడా ప్రాయోపవేశం చేయవచ్చును కదా' అనటమూ, మద్రాసుపై ఆంధ్రులకుగల హక్కులు 'అనుమానాస్పదమైనది' గా పేర్కొనటము, స్వామి సీతారాంవంటి ప్రజాసేవకుడు పూనిన ప్రాయోపవేశదీక్ష అదొకరకమైన హాంం క్రింద జమకట్టి మాట్లాడటమూ నెహ్రూ గారికి యెంతమాత్రమూ తగదని లింగరాజు సవినయంగా తమ లేఖలో నివేదించారు.

### స్వామి సీతారాంకు ఆంధ్ర మహాసభ కార్యదర్శి విజ్ఞప్తి

గుంటూరు, సెప్టెంబరు 14: మద్రాసు ముఖ్య మంత్రి ద్వారా "నెహ్రూ పంపినటువంటి సందేశం, ఆంధ్రరాష్ట్రం కావాలని వాదించేవారి నందరినీ సంఘటితం కమ్మని ఆదేశిస్తున్నది. మనమంతా ఏకమై సత్వర మేరాష్ట్రాన్ని నిర్మించుకోవలసి వున్న" దని ఆంధ్ర మహాసభ కార్యదర్శి జి. వి. పున్నయ్య శాస్త్రిగారు నేడు జారీచేసిన ప్రకటనలో పేర్కొన్నారు. ఈ ఐక్యతను సాధించటానికి ఆంధ్ర కాంగ్రెసు కమిటీ కృషి చేస్తున్నందుకు తమ హర్షాన్ని వెలిబుచ్చారు. ఆ ప్రకటనలో యింకా యిలా వుంది:

"స్వామి సీతారాంగారు ఆంధ్ర నాయకులలో పూజనీయులు. వారు ఆమరణాంత నిరాహార దీక్షద్వారా ఆంధ్ర రాష్ట్రాన్ని అవతరింపచేసే బాధ్యత తమ ఒక్కరిపైనే వేసుకొన్నారు. ఆయన పూనినదీక్ష ఆంధ్రులను మరొకసారి కదలించింది. వివాదగ్రస్త అంశాలు పంచాయతీవల్ల పరిష్కారం కావాలనీ స్వామీజీయే కోరుతున్నారు. ఆంధ్రులు తమలో తామంతా ఏకమై స్వరాష్ట్ర వాంఛను వెలిబుచ్చటమే కాక, తమ యిరుగు పొరుగు ప్రాంతాలవారితో కూడా వీలైనంత హెచ్చుగాని కాభిప్రాయాలను కుదుర్చుకోవాలని నెహ్రూ కోరుతున్నట్లు వారితంతినూచిస్తున్నది. అన్నిటికంటె ముందు స్వామి సీతారాంగారు ఆంధ్రులలో ఐకమత్యాన్ని స్థాపించటానికి కృషి చేయవలసి ఉన్నది. అట్టి ప్రయత్నంలో అన్నిరకాల దృక్పథాలు కలవారితో నూ చర్చించి, వారిని ఒప్పించే ఓపిక స్వామీజీకి వుండాలి. ఆంధ్రులలో ఐక్యత సాధించగల శక్తి ఆయన ఒక్కరికే వున్నది. కాబట్టి ఆయన తన దీక్షను యింకా పొడిగించి, తానూ ఎదురు ప్రతిపాదనలు చేయ పూనుకోక, వెంటనే ప్రాయోపవేశం విరమించి, నెహ్రూగారు నిర్ణయించిన మార్గాన్ని అనుసరించి కృషి చేయాలి. ఆంధ్రరాష్ట్ర అవతరణం ఒకటి రెండు నెలలు ఆలస్యమైనా కూడా ఫరవాలేదు. మనమంతా కార్యదక్షులమనీ, రాజనీతిజ్ఞులకలవారమనీ చాటుకోవాలి.

స్వామీజీ ప్రాణంఅమూల్యమైనది. ప్రస్తుత ఆందోళనకరపరిస్థితి మరికొంత సేపైనా వుండనీయరాదు. నెహ్రూగారు స్వామీజీకి నేరుగా హామీనిస్తే కొంత ప్రయోజనం వుంటుంది. ఇంతవరకూ నెహ్రూగారు స్వామీజీకి నేరుగా ఎన్నడూ సమాధానం యిచ్చినట్లు కనపడదు.

1950 జనవరి 26 న అదుగోవస్తున్న దనుకొన్న ఆంధ్రరాష్ట్రం టంగుటూరి ప్రకాశంగారి ప్రాతికూల్య ప్రకటన కారణంగానూ, అట్టి అభిప్రాయాన్ని ఎన్. జి. రంగాగారి నాయకత్వాన ఆనాడువున్న ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కమిటీవారు మద్దతుచేయటం వల్లనూ మటుమాయమైపోయింది. అటువంటి చిక్కని తరుణంలో రాబోతున్న రాష్ట్రాన్ని రాకుండా చేసినవారు ఏనాటికైనా ఆంధ్రప్రజలకు సంజాయిషీ యిచ్చుకోవాల్సివుంది. ఆనాడు ఆవిధంగా వ్యవహరించినవారే ఇప్పుడు స్వామీజీ ఉద్యమాన్ని బలపరిచేవారుగా తయారు అయారు! స్వామీ సీతారాంగారి యీ మహోన్నత ఉద్యమాన్ని తమ తమ స్వప్రయోజనాలకు వినియోగించుకోవాలనే వుద్దేశంతో పెద్దయెత్తున సానుభూతి ప్రకటనలు చేసేవారికంటె ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రవాంఛ ఎంతమాత్రమూ తక్కువగా లేదు. ఈవిధమైన రాజకీయ అవకాశవాదాన్ని ఆంధ్రప్రజలు సకాలంలో అదుపుచేయాలి. ఏపార్టీకానీ, ఏవ్యక్తికానీ యీ ఉద్యమాన్ని ఎన్నికల స్టంటుగా తయారుచేయటం సహించరానిది."

## ఆంధ్ర కాంగ్రెసు తీర్మానంపట్ల నిరసన

### పి. సి. సి. సభ్యుని రాజీనామా

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులు ఆత్కూరి అప్పలరాజుగారు దిగువ ప్రకటన చేశారు.

"శ్రీస్వామి సీతారాం ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయంలో సాగించుచున్న ప్రాయోపవేశవ్రతముపట్ల జిల్లాలలో సమావేశమైన ఆంధ్ర కాంగ్రెసు వారు సానుభూతి చూపించక పోవుటయే గాక, యేకాంగ్రెసువాది కూడా స్వామీజీ కార్యక్రమాన్ని బలపరచుటగాని, పాల్గొనుటగాని కూడదని చేసిన తీర్మానంపట్ల నా నిరసన తెలుపుతూ, నేను నా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యత్వానికి రాజీనామా యిస్తున్నాను."

# హిందూ ధర్మశాస్త్రసవరణబిల్లుపై పార్లమెంటులో క్లాజువారీ చర్చ

## మొదటి రెండు భాగాల పరిశీలన పూర్తిచేస్తామని నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 17: నవ్వులు, కేకలు కోలాహలాలు ఒక కొంత ఉద్వేగం వీటిలో హిందూకోడు బిల్లుమీద నేడు పార్లమెంటులో చర్చ ప్రారంభమైనది.

ప్రేక్షకుల స్థానాలన్నీ కిటకిటలాడి పోయాయి. సభకు వచ్చిన సభ్యుల సంఖ్యకూడా అధికంగావుంది. ప్రదర్శనాలు అవీ ఏమీ జరుగకుండా చూడటానికిగాను తగిన బందోబస్తు లన్నీ చేయబడినవి.

పార్లమెంటు భవనం ముందు గా పోయేబక్షి రస్తాను మరొక వంకకు మార్చారు.

సభ ప్రారంభం కాగానే డిప్యూటీ స్పీకరు న్యాయమంత్రిని చర్చ ప్రారంభించ వలసిందిగా కోరారు. వెంటనే నజీరుద్దీన్ అహ్మద్ పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేవదీశారు. వెంటనే శ్రీమతి దుర్గాబాయి అందుకొని, ఏ విషయాన్ని గురించి ఈ పాయింట్ ఆఫ్‌ఆర్డరు? అని అడిగింది. శ్రీ సోంధీ ఆమెను ఉద్దేశించి, మీరెవరు ఆ ప్రశ్న అడగడానికి అని ముందలించారు.

ఇంతకు ముందు పార్లమెంటులో ఒక చిన్న ఉపన్యాసం ఇస్తూ ఈబిల్లును పూర్తిగా ఆమోదింప చేయడం కాలం సరిపోవడం మీద ఆధారపడి వున్నదని ప్రధానమంత్రి పండిత నెహ్రూ వ్యాఖ్యచ్చారు. బిల్లును అంకాల ప్రకారం చర్చకు గ్రహించి నప్పుడు కోడు యొక్క ప్రథమభాగం విచారణీయాంశం అవుతుంది. (ఈ భాగం నిర్వచనాలకు వాటికి సంబంధించింది) ఆ తర్వాత ద్వితీయ భాగం. ఇది పెళ్లిళ్లు, విడాకులు వీటికి సంబంధించింది. ఈ విధంగా తక్కిన బిల్లు చర్చకు వుంచబడుతుంది. అయితే బిల్లు రెండోభాగం మీద చర్చ పూర్తి అయి ఈ సమావేశంలో ఆమోదింపబడాలి. తక్కిన దానిని విషయం తర్వాత చూసుకోవచ్చు, అని ఆయన సభవారికి నివేదించారు.

నెహ్రూ భావం ప్రకారం బిల్లు మీద చర్చ వారం రోజులలో పూర్తి కావలసివుంది.

అనంతరం శ్రీ ఆర్. కె. చౌదరి మాట్లాడారు. ఆయన స్వయంగా హాస్యచతురుడు. అందువల్ల ఆయన లేవగానే అందరికి నవ్వువచ్చింది. సభవారిని ఉద్దేశించి ఆయన ఈ విధంగా మాట్లాడారు. కథాక్రమం ప్రారంభం కాకముందు నేను ఒక మనవి చేయదలచుకున్నాను. అనవసరంగా ఉద్రేక ఉద్వేగాలకు ఎవరూ లోను కావద్దు. ఇప్పుడు శ్రీమతి దుర్గాబాయి ఇంతమంది సమక్షంలో ప్రదర్శించిన ఉద్రేకం ఔచిత్యవంతంగాలేదు. అదీ కాక బిల్లుకు రాష్ట్రపతి అంతి సుముఖుడుగా లేడని అంటున్నారు. దానిని గూర్చి ప్రభుత్వం వారికేమన్నా తెలిస్తే కొంచెం మాకుగూడా తెలియ చెప్పవలసిందిగా అర్థిస్తున్నాను.

శ్రీమతి దుర్గాబాయి వెంటనే లేచి నిలబడింది. శ్రీ చౌదరి తన్ను గూర్చి అన్న మాటలను ఖండించాలని ఆమె అట్లా చేసివుంటుంది. కాని డిప్యూటీ స్పీకరు అడ్డుపడి, నేను స్వస్థానంలో కూర్చుని వుండగా ఒకరి తర్వాత ఒకరుగా లేచిమాట్లాడవలసిందేగాని ఇంకోవిధంగా జరిగేందుకు వీలులేదు. ఇప్పుడు ఒకసభ్యుడు, మరొసభ్యురాలికి కొంత హితవు ఏదో చెప్పారు. అహితవులో గూడా ఉద్రేకం తొంగిచూస్తూనే వుంది. అని అన్నారు. సభ్యులు ఆనందించారు.

ఈబిల్లువిషయమై చర్చ జరిగేటప్పుడు సభను ప్రలోభపెట్టేందుకు రాష్ట్రపతి పేరును తీసుకురావడం తగదని ఆయన సభ్యులకు ఒక హెచ్చరిక చేశారు.

ఇంతటితో హాస్యాదికాలు పూర్తి అయి అచ్చమయిన చర్చకు సభవారు ఇచ్చగిస్తున్నట్లు వున్న సమయంలో శ్రీకామత్ ఒక ప్రశ్న వేశారు. ఆప్రశ్నకు ఆయన "పాయింట్ ఆఫ్ పోస్సిబిలిటీ" అని నామకరణం చేశారు. అది డా. అంబేద్కర్ అప్పుడుచేస్తున్న ఒకానొకకార్యాన్ని గూర్చింది. అంబేద్కర్ బల్లమీద అప్పుడేదో వస్తువు వుంది. దానిని అట్లా ఆయన తన ముందువుంచుకోవడం మంచిదేనా అని ఆయన ప్రశ్నించారు. అంతా పగలబడి నవ్వారు. డా. అంబేద్కర్ దాన్ని అప్పటినుంచి తొలగించారు.

సర్దార్ భూపేంద్ర సింగుమాన్ అన్న మాటలు తరువాత నవ్వులకు కారణమైనాయి. డిప్యూటీ స్పీకరు ఆడవాళ్ళను ఒకవిధంగానూ, మగవాళ్లను మరో విధంగానూ చూసే అలవాటు వున్నదని, ఆయన దానిని మానుకొని, అందరినీ ఒకే దృష్టితో చూడటం మంచిదని అంటూ, ఆడవాళ్ళకు ఇంతవరకు ఏదో మెహర్బానీ చూపుతూ వచ్చాం. ఇప్పుడు ఆమెహర్బానీలు అక్కరలేదని, హిందూకోడుబిల్లు కావాలో వారు తేల్చుకోవడం అవసరం అని ఆయన అన్నారు. శ్రీమతి దుర్గాబాయి, శ్రీమతి రేణుకారే ఆ మాటలకు అభ్యంతరం చెప్పడానికిగాను లేచి, ఏదో అన్నారు. గాని, ఆ మాటలు అప్పుడు చెలరేగిన నవ్వులలో ఎవరికీ వినిపించలేదు.

శ్రీమతి దుర్గాబాయి: మా ఆడవాళ్ళకు మెహర్బానీలతో నిమిత్తం లేదు, గౌరవ సభ్యుడు పొరపాటు పడుతున్నారు.

డిప్యూటీ స్పీకరు: ఇక్కడ సభలో వున్న సభ్యురాండ్రకు అట్టి మెహర్బానీలతో నిమిత్తం లేదని నాకు తెలియని విషయంకాదు. ఒక వేళ అట్టి మెహర్బానీ ఏదన్నా నేను చూపినా, దాన్ని ఔదార్యంతో గ్రహించండి. నేను వున్నానంటె నాకు కూతుర్ళు వున్నారు. కోడళ్లు వున్నారు. అందువల్ల ఇట్టి విషయాలలో నేను వర్తిగా వ్యవహరించడానికి ప్రయత్నిస్తాను.

వివరింప సంభాషణాక్రమం నడిచిన అనంతరం డిప్యూటీ స్పీకరు నజీరుద్దీన్ అహ్మద్ దిక్కు ఆయన పాయింట్ ఆఫ్ ఆర్డర్ ఏమిటో స్పష్టంగా వివరించవలసిందని కోరారు. ఆయన తన పాయింట్ ఆర్డరును ఈవిధంగా వివరించారు. ఇప్పుడు హిందూకోడుబిల్లు పూర్వం స్వదేశ సంస్థానాలుగా వ్యవహరించబడిన పార్టు 'బి' రాష్ట్రాలకునూ, 'సి' పార్టు రాష్ట్రాలతో విలీనం చేయబడిన వాటికిన్నీ వర్తిస్తుందా అని.

ఈ అనుమానం బిల్లులో రెండో అంశానికి వర్తిస్తుందని తనకు తోచడం లేదని డిప్యూటీ స్పీకరు అన్నారు. 1 వ అంశం ఆ విషయం తేలుస్తుంది. అప్పుడు ఈ అనుమానాన్ని లేవదీయవచ్చు అని సలహా ఇచ్చారు. "కాని ఆ అంశం చివరికిగాని చర్చకు రాదు. ఆ విషయాన్ని నజీరుద్దీన్‌అహ్మద్ బయటపెట్టి, అట్టి సందర్భంలో ఈ బిల్లు తమకు వర్తించదని తెలిస్తే, ఆ ప్రాంతాల సభ్యులు ఈచర్చల్లో పాల్గొనరు. ఇప్పుడు ఈ చర్చల్లో పాల్గొనాలో, అక్కరలేదో వారికి తెలియకుండా వుంది. అందువల్ల ఏదిఏమిటో తెలుసుకోవడం సభకు ఉచితం అని నా అభిప్రాయం అని వాదించారు.

డిప్యూటీ స్పీకరు: ఇది తమ ప్రాంతాలకుగూడా అనువర్తిస్తుందన్న భావంతోనే ఆప్రాంతాలవారుగూడా చర్చల్లో పాల్గొనడం మంచిది.

## తగినవారు దొరికితే అధ్యక్షపదవి విరమణ

(1 వ పేజీ తరువాయి)

అయోమయావస్థ అనిశ్చితత్వం ప్రవేశించిందనడానికి ఈ మిశ్రాగారి వైఖరి ఉదాహరణం. మిశ్రాగారిలాంటివ్యక్తులు కాంగ్రెసులో చాలామంది వున్నారని నా అనుమానం. కాంగ్రెసులో అతకని వ్యక్తులు అనేకమంది కాంగ్రెసులో ప్రవేశించారు. వారికి తగినంత ప్రోత్సాహంకూడా లభించింది. కాకపోతే కాంగ్రెసు తత్వంలో ఎందునా పొందని మిశ్రాలాంటి వ్యక్తికి కాంగ్రెసులో అంత బాధ్యతగల స్థానం ఎల్లా లభిస్తుంది? కాంగ్రెసు పునరుజ్జీవితం కావాలంటే, యీ అనిశ్చిత వస్థను తొలగించాలి, ప్రజలు స్పష్టమయిన అభిప్రాయాలతో స్థిరసంకల్పంతో కార్యాచరణకు పూనుకొనేటట్టు చేయగలగాలి."

కార్యవర్గంలో అయిదు స్థానాలు ఖాళీగా వుంచింది కాంగ్రెసునుంచి నిష్క్రమించినవారి నిమిత్తంగానేనా? అని ప్రశ్నించగా నెహ్రూ ఇలా అన్నారు:

"వర్గాలను ముఠాలను దృష్టిలో పెట్టుకొని నేనెప్పుడూ ఆలోచించను. అన్ని పేర్లు ఒక మాటుగా నిర్ధారణ చేయలేకపోయాను; కాని కార్యవర్గ సభ్యుల పేర్లను తక్షణమే ప్రకటించడం అవసరం అనిపించింది; అందువల్ల నిర్ణయించినంత మటుకు నిర్ణయించినవారి పేర్లను ప్రకటించాను. కార్యవర్గంలో ప్రాతినిధ్యం ఇవ్వవలసిన రాష్ట్రాలు ఇంకా కొన్ని వున్నాయి. స్త్రీ సభ్యులకుకూడ కొందరికి స్థానం చూపించవలసి వుంది. ఈ అయిదు సీట్లను ఖాళీగా ఉంచడంలో ఇంతకుమించి ప్రత్యేకమైన ఉద్దేశ్యం ఏమీ లేదు." అని పండిట్ నెహ్రూ స్పష్టపరిచారు.

కాంగ్రెసునుంచి వెళ్లిపోయిన వారంతా మళ్లీ చేరకపోయినట్లయితే కాంగ్రెసు ఎల్లా పునరుజ్జీవితం అవుతుంది? అని ఒక విలేఖరి అడుగగా, "కాంగ్రెసు సమర్థంగా పనిచేయడం పనిచేయక పోవడం అన్నది అనేక విషయాలమీద ఆధారపడివుంది. కాంగ్రెసునుంచి తిరిగిపోయినవారు మళ్లీ చేరడం ఈ అనేక విషయాలలో ఒకటి. అసలు కాంగ్రెసు పునరుజ్జీవితం అవుతుందా కాదా అనేది కాంగ్రెసు సేవకుల ప్రవర్తనమీద వారి కార్యదీక్షమీద ఆధారపడి వుంటుంది." అని పండిట్ నెహ్రూ జవాబిచ్చారు.

## ఢిల్లీలో అత్యంత ప్రధానమైన చర్చలు

(1 వ పేజీ తరువాయి)

"ఆంధ్రుల జనాభా 3½ కోట్లు ఇంగ్లండు స్కాట్లండులలో కలిసె ఎంత జనాభాఅంత ఆంధ్రులజనాభా ఫిన్లండు, స్వీడను, నార్వే, డెన్మార్కు, హాలండుల జనాభాకూడా ఆంధ్రుల జనాభా అంతలేదు. ఒక్క జనాభా విషయంలో నేగాదు, సాధన, సంపద, ఇతర సౌకర్యాల విషయంలోగూడా, యీ దేశాలలో కొన్ని ఆంధ్ర దేశంతో సరితూగలేవు. అయినా వీటిలో ప్రతిఒక్కటి అనేక శతాబ్దాలుగా స్వతంత్ర దేశాలై స్వభాషలో, పరిపాలనను నిర్వహించుకొంటున్నాయి. మద్రాసు హైదరాబాదు రాష్ట్రాలలో జిల్లా చెదరివున్న ఆంధ్రులకు, తమ మాతృభాష మద్రాసులో ఇంగ్లీషుకు, హైదరాబాద్‌లో ఉర్దూకు లొంగిపడి ఉండడంవల్ల కలిగే కీడు తెలుసు. కాని ఈరెండు రాష్ట్రాలలోనూ విద్యా వంతులకు సార్వత్రపదులు కొందరు యధావిధిగా ఉండాలని అభిలషిస్తున్నారు. నేను గ్రామీణప్రజానీకంలో ఒకణ్ణి. మాతృభాషలో తప్ప అన్యభాషలో పరిపాలనా వ్యవహారం సాగడం గ్రామీణులు ఓమాత్రమైనా సహించలేరని నాకు బాగా తెలుసు. ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రం అడుగుతున్నారంటే, వాళ్ళేది సంపూర్ణ స్వాతంత్ర్యము గాదు.

నాకు తెలిసినంతవరకూ, ఆంధ్ర రాష్ట్రోద్యమము, యిప్పుడు గాని, మరెప్పుడుగాని, స్వాతంత్ర్యోద్యమం కాదు. ఇదివరకు బ్రిటిషు ఇండియాలో, ఇప్పుడు భారత యూనియనులోను, ఒక అంగంగా రాష్ట్రస్వపరిపాలననే ఆంధ్రులు కోరుతున్నారు. ఈ కోరిక యీ నాటిదిగాదు. 40 యేండ్ల నాటిది యావదాంధ్రులు,-మద్రాసు హైదరాబాదు రాష్ట్రాలలోని వారేగాదు, బొంబాయి బీహారు మధ్యప్రదేశ్ రాష్ట్రాలలోని ఆంధ్రులు గూడా, యీ కోరికను ముక్తకంఠంతో చాటుతున్నారు. నా యీ ప్రాయోపవేశం, న్యాయబద్ధమైన నిర్నిరోధమైన ఆంధ్రప్రజావాంఛను ప్రబలచిన్నాం. ఈ వాంఛ నెరవేరినప్పుడే ఆంధ్రుల మాతృభాష వారి వ్యవహారములలో నేగాదు, శాసనసభలోనూ, న్యాయస్థానాలలో, విజ్ఞాన కేంద్రాలలో ప్రతిచోట అర్హస్థానాన్ని పరిగ్రహించగలుగుతుంది."

"కాని న్యాయబద్ధమై సహజసిద్ధమై, ఆంధ్రులవాంఛను యిప్పటికెన్నో పర్యాయములు నిరాకరించడం జరిగింది. తత్ఫలితంగా ఆంధ్రులలో ఒక విషమైన వైరాశ్యం ప్రబలింది. ఈనిస్పృహాయలను వైరాశ్యాన్ని నిర్మూలించుటకే నేనీప్రాయోపవేశం తలపెట్టాను. నా ప్రాయోపవేశంవల్ల గత 30 యేండ్లలో యెన్నడూ కనివిని ఎరుగని నూతనశక్తి ప్రాదుర్భవించింది భారతదేశానికి స్వాతంత్ర్యం లభిస్తే, ఆంధ్రరాష్ట్రం రాగలదన్న నమ్మకంతో, మా ఆంధ్ర నాయకులు, భారత స్వాతంత్ర్య పోరాటానికి ప్రాధాన్యత యిచ్చి, ఆ సమరాంగణంలో పాల్గొన్నారు. భారతజాతి జనకుడైనమహాత్మాగాంధిలగాయతూ, రాష్ట్రనాయకులవరకు, అయా పెద్దలు చేసిన ప్రకటనలవల్ల ఉత్సాహంతో పొంగిపోయారు.

"ఇవన్నీ ఎవరూ కాదనజాలని యదార్థ విషయాలు. వీటిని గమనించి ఆంధ్రరాష్ట్ర సమస్యా పరిష్కారానికి పూనుకోవలెనని భారత ప్రధానికి నా మనవి. నేను కోరకోర్కె చాలా సామాన్యము సులభసాధ్యము అయినది. అది ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అనువుగా పార్లమెంటులో శాసనం ప్రతిపాదించాలని, అక్టోబరు 2 వ తేదీ నాటికి రాష్ట్రాన్ని యేర్పాటు చేయాలని ఇందుకు ప్రారంభ కార్యకలాపాలన్నీ ఆ యీ అధికారులకు వచ్చిన విధంగా సాగించవచ్చని. వెంటనే రాష్ట్రాన్ని నిర్మించడానికి వీలుగా నేను కొన్ని నిర్మాణాత్మకమైన సూచనలు చేశాను." నా ప్రాయోపవేశంవల్ల ప్రజానీకంలో జనించిన నూతనశక్తిని, ఆంధ్రాభ్యుదయానికి, యావద్భారత శ్రేయస్సుకు వినియోగించదలచాను. కాని ఆంధ్రరాష్ట్ర సమస్య సత్వరం పరిష్కారం గాకపోతే, యీ మహాశక్తి ఉపద్రవకరముగా పరిణమించవచ్చు. అందుకు నేను బాధ్యుడనుకాను. మహాత్మగాంధి శిష్యప్రముఖుడు, సర్వోదయ ఉద్యమ నాయకుడు అయిన వినోబాభావే నా ఆశయాన్ని, నా చర్యను ఆమోదించారని నేనీ సందర్భంలో చెప్పదలచాను.

"కాంగ్రెసు కార్యకర్తలకు నేను విజ్ఞప్తి చేయడంలో ఉద్దేశ్యం, దేశాభివృద్ధికి సహాయకారి అయే కార్యకలాపాల్లో వారు తీవ్రంగా కృషి చేయాలి, అని కాంగ్రెసుతో సహకరించవలసిందని ప్రజలకు విజ్ఞప్తిచేయడంలో ఉద్దేశ్యం, కాంగ్రెసుకు ప్రతిపక్షాలంటూ లేకుండా అన్నిటినీ రద్దుచేసి, అందరూ కాంగ్రెసులో చేరిపోవాలని కాదు. ప్రజలంతా కాంగ్రెసులో చేరిపోతే మంచిదే. కాని కాంగ్రెసు అభ్యుదయమార్గాన నడుస్తూ పటుత్వంతో పనిచేయగల్గినప్పుడే, అందువల్ల ఏమైన ప్రయోజనం వుంటుంది.

నేను కోరుతున్నదల్లా ఏమిటంటే, ఏయేకార్యక్రమాల విషయంలో అయితే, సిద్ధాంతరీత్యా వివిధపార్టీలకు ఏకాభిప్రాయం కుదురుతుందో ఆయా కార్యక్రమాల నిర్వహణలో ఈ అన్ని పార్టీలుపరస్పరం సహకరించుకోవాలి.

